శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# శ్రీశైలేశ దయాపాత్ర స్తోత్రమ్

('జగదాచార్య' ఉ.వే.శ్రీమాన్ కాఞ్చీ ప్రతివాది భయంకరం అణ్ణఙ్గరాచార్య స్వామి ప్రణీతమ్)




**తాత్పర్యకర్త:**

**'పండిత రత్న' ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు**

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్



**ప్లవ నామ సంవత్సరం, అల్పిశి - మూలం (మణవాళమాముని తిరునక్షత్రం) - 08-11-2021**

# ఆచార్యవరివస్య

**పర్యాయభాష్యకారం శ్రీశైలేశార్యసత్కృపాపాత్రమ్,**

**జ్ఞానాదిసద్గుణాఢ్యం వరవరయోగీశ్వరం సదా వందే.**

శ్రీమన్నారాయణుని ఆజ్ఞానుసారం అజ్ఞానమయమైన ఈ సంసారంలోని చేతనులను ఉద్ధరించడంకోసం ఆదిశేషులు భగవద్రామానుజులుగా అవతరించి, 120 సంవత్సరాల పాటు ఈ భూమిపై వేంచేసి ఉండి, భగవంతుని ఆజ్ఞను పరిపాలించారు. తాము నిర్వహించవలసిన కర్తవ్యంలోని మిగిలిన భాగాన్ని పూర్తిచేయడంకోసం ఆ ఆదిశేషులే మళ్లీ ఈ లోకంలో శ్రీమణవాళ మహామునులుగా(శ్రీవరవరమునులుగా) అవతరించారని సాంప్రదాయికమైన విశ్వాసం.



'శ్రీశైలేశ దయాపాత్రమ్' శ్లోకం ఆవిర్భావ సన్నివేశం

భగవద్రామానుజులవల్ల సంస్కృత వేదాంతం విశ్వతోముఖంగా అభివృద్ధి చెందగా, ద్రావిడ వేదాంతం శ్రీవరవరమునువల్ల బహుముఖంగా అభివృద్ధి చెందింది. తెన్నాచార్య సంప్రదాయానికి

సంబంధించిన ఆచార్య పరంపర శ్రీవరవరమునులతో పూర్తి అవుతున్నది. శ్రీరంగనాథుడు వీరికి శిష్యుడై, ఒక సంవత్సర కాలంపాటు వీరివద్ద ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని కాలక్షేపంగా ఆలకించి, గురుదక్షిణగా వీరి వైభవాన్ని తెలియజేసే "శ్రీశైలేశ దయాపాత్రమ్" ఇత్యాదితనియన్ శ్లోకాన్ని సమర్పించిన వృత్తాంతం వీరి చరిత్రలో సుప్రసిద్ధం. శ్రీవరవరమునులు తులామాసం మూలా నక్షత్రంలో అవతరించారు.

శ్రీవరవరమునుల వైభవాన్ని బహుముఖంగా వారి కాలంలోనే పలువురు ప్రకాశింప జేశారు. దేవరాజగురువు అనే ఎఱుంబియప్పా- **వరవరమునిశతకం, వరవరముని చంపు** మొదలైన కృతులను రచించారు. ప్రతివాది భయంకరం అణ్ణా - **వరవరమునిశతకం, వరవరముని సుప్రభాతం, వరవరముని ప్రపత్తి, వరవరముని మంగళాశాసనం** అనే కృతులను సంస్కృతంలో, **అమలనాదిపిరాన్** అనే కృతిని ద్రావిడంలో రచించారు. కోయిల్ కందాడై అణ్ణన్ వీరి విషయంగా **కణ్ణినుణ్ శిఱుత్తాంబు** అనే ద్రావిడ ప్రబంధాన్ని రచించారు. అనంతర కాలంలో కూడా ఎంతోమంది మహనీయులు వీరి మహిమను వర్ణించే గ్రంథాలను వెలయించారు. శ్రీపిళ్లైలోకం జీయర్ రచించిన **యతీంద్రప్రవణ ప్రభావం**, వాధూల వీరరాఘవాచార్యస్వామివారి **శ్రీవరవరముని సుచరితచషకం** మొదలైనవి దీనికి ఉదాహరణాలు.

గడచిన శతాబ్దిలో సుమారు సంవత్సరాల కాలం అప్రతిహతంగా భారతదేశంలో అంతట, విశేషించి, తమిళనాడు ప్రాంతంలో శ్రీవైష్ణవసంప్రదాయాన్ని, భగవద్రామానుజ సిద్ధాంతాన్ని అనితరసాధారణమైన రీతిలో ప్రచారం చేసిన మహనీయులు **కాఞ్చీ మహా విద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్య సింహాసనాధిపతి, ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణఙ్గరాచార్యస్వామివారు**. వీరు శ్రీవరవరమునుల మహిమ కీర్తించే ఎన్నో కృతులను చిత్రకవిత్వ ప్రక్రియలో రచించారు. వాటిలో ఈ **శ్రీశైలేశ దయాపాత్ర స్తోత్రం** ఒకటి. ఈ స్తోత్రంలో ఒక విలక్షణమైన ప్రక్రియ అనుసరింపబడింది. "శ్రీశైలేశ దయాపాత్రమ్" అనే శ్రీవరవరమునుల

తనియన్ శ్లోకంలో ఉండే వర్ణాల క్రమాన్ని అనుసరించి శార్దూల విక్రీడిత వృత్తంలో రచింపబడిన శ్లోకాలతో కూర్చిన కృతి ఇది. ఇందులోని శ్లోకాలకు ద్రావిడంలో తాత్పర్యాలను స్వామివారే స్వయంగా అనుగ్రహించారు.

ఈ సంవత్సరం జరిగే శ్రీమణవాళ మహామునుల తిరునక్షత్రోత్సవ స్మృతిచిహ్నంగా ఈ స్తుతిగ్రంథం తెలుగు తాత్పర్యంతో భాగవతగోష్ఠికి సమర్పించబడుతున్నది. దీనిని తెలుగులో అనువదించి, వెలువరించడానికి సహృదయతతో అనుమతినిచ్చిన స్వామివారి పౌత్రులు **ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం రాజహంసమ్ స్వామివారి సన్నిధిలో, వారి సోదరుల సన్నిధిలో** కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. ఇందులోని శ్లోకాలకి అక్షరయోజనాన్ని అందించిన సుహృదయులు **ఉ.వే.శ్రీమాన్ మొలుగు వేంకటాచార్య స్వామివారికి** అనేక దాసోహములు. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో సహాయపడిన కుమారుడు చిరంజీవి శ్రీమాన్ అనంతరంగరామన్ కు అనేక మంగళాశాసనాలు. స్వస్తి.



**వాచికీ వరివస్యైషా వినమ్రశిరసాఽర్ప్యతే.**

**శ్రీమద్వరమునీంద్రాణాం పాదాంభోజాతయుగ్మకే.**

భాగవత దాసుడు,

**ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు**

నరసాపురం, 08-నవంబరు-2021

.





పాఞ్చజన్య సమః కంఠే దర్శనే శ్రీ సుదర్శనః
శ్రీమానణ్ణఙ్గరార్యోయం శ్రీశతత్త్వ నిరూపకః

**కాంచీ మహా విద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్య సింహాసనాధిపతి**

**ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణఙ్గరాచార్యస్వామివారు (1891-1983)**

**(శ్రీశైలేశ దయాపాత్ర స్తోత్రమ్ - స్తుతికర్త)**

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమద్వరవరమునయే నమః**

# శ్రీశైలేశ దయాపాత్ర స్తోత్రమ్

**శం నో మిత్ర ఇతీరయంతు కతిచిత్ శం నో భవత్వర్యమే—**

**త్యేవం కేచన చక్షతాం మమ పున స్తత్తాదృగీశూషూక్తిషు |**

**శ్రద్ధాలేశలవోऽపి నాస్తి సతతం జిహ్వా మమామ్రేడయేత్**

**శం నో రమ్యవరోపయంతృమునిరాట్ భూయాదితీమామృచమ్ ‖ 01 ‖**

"శం నో మిత్రః" అని, "శం నో భవత్వర్యమా" అని చెప్పేవారు ఆ విధంగానే చెప్పనీ. ఆ ఉక్తులలో నాకు ఏ విధమైన ఆసక్తి లేదు.**"శం నో రమ్యవరోపయంతృమునిరాట్ భూయాత్"** (శ్రీవరవరమునీంద్రులే మనకు అన్ని విధాలైన క్షేమాలను కలిగించేవారు కాగలరు) అనే ఈ ఋక్కును నా నాలుక ఎల్లప్పుడు మాటిమాటికి అనుసంధించాలి.



మణవాళమాామునులు – ఆళ్వార్ తిరునగరి

**రంగ రంగమితీరయంతి కతిచిద్రామానుజేతి బ్రువం**

**త్యన్యే కేశవ మాధవాచ్యుత హరే నారాయణేతీతరే |**

**తత్తాదృగ్వచనాని మా స్మ నిపతన్ కర్ణే మదీయే పునః**

**శ్రీమద్రమ్యవరోపయంతృమునిరిత్యాఖ్యైవ కర్ణామృతమ్ || 02 ||**

"రంగం రంగమితి బ్రూయాత్ క్షుతప్రస్ఖలనాదిషు" (తుమ్మినప్పుడు, తొట్రుపాటు-పడినప్పుడు ‘రంగ రంగ’ అని పలకాలి) అనే శాస్త్రవచనాన్ని అనుసరించి తుమ్మినప్పుడు, తడబడినప్పుడు ‘రంగ! రంగ!’ అని పలికేవారు ఆచార్య నామసంకీర్తనమే ఉద్దేశ్యం అని భావించి, ‘రామానుజ!’ అని అనేవారు, ‘కేశవా! మాధవా!’ అని భగవన్నామ సంకీర్తన చేసేవారు ఈ లోకంలో పలువురు ఉంటే ఉండనీ. అటువంటి నామ సంకీర్తనలు నా చెవిలో పడవద్దు. శ్రీ వరవరమునులు అనే తిరునామమే నా చెవులకు అమృతం.



**ఈశానోఽపి న దైవతం న చ విధి ర్నో వాసవో నార్యమా**
**కిం తు శ్రీపతిరేక ఏవ భగవాన్నారాయణో దైవతమ్ |**
**ఇత్యేవం కథయంతి వైదికవరాః చిత్తం మదీయం పునః**
**సిద్ధాంతం సుదృఢం బిభర్తి వరయోగీంద్రః పరం దైవతమ్ || 03 ||**

"శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు – అనే వీరు ఎవరూ దైవం కాదు. శ్రీమన్నారాయణుడే పరదైవం" అనే వైదిక సిద్ధాంతం ఉన్నప్పటికీ, నా మనసులో స్థిరంగా నిలచిన సిద్ధాంతం ఏమంటే, శ్రీవరవరమునులే పరదైవం అని.

---

**శక్తో నైవ రమాపతి స్సుమధురై స్సూక్తై ర్బుధానాం మనో**
**హర్తుం కిం తు పరాశరప్రభృతిభి ర్వంచ్యామహే తద్గిరా |**
**ఆచార్యో వరయోగిరాడిహ భువి స్వైరం సమేత్య స్వయం**
**సూక్తీ ర్దివ్యసుధామయీ రుపదిశన్ విద్వన్మనఃకర్షతి || 04 ||**

భగవంతుడు పరదైవమని కీర్తింపబడుతున్నా, ఆ స్వామి చెవులకు ఇంపైన, అందమైన వాక్కులతో వివేకుల మనసును ఆకర్షించగలిగినవాడు కాడు. ఏమి? శ్రీవిష్ణుపురాణం, భగవద్గీత



మణవాళమామునుల పాదుకలు – శ్రీరంగం

మొదలైనవానిలో ఆ స్వామి పలికిన దివ్యసూక్తులు లేవా? అని అంటే, వ్యాసుడు, పరాశరుడు మొదలైన మహర్షులు వేనినో వ్రాసి, భగవంతుని వాక్యాలని మనలను వంచించారు, అంతే. శ్రీ వరవరమునులు అయితే ఆ విధంగా కాకుండా సాక్షాత్తు అవతరించి, అమృతంవంటి, మృదువైన సూక్తులను తామే అనుగ్రహించి, విజ్ఞుల మనసును కొల్లగొట్టారు.

---

**ఐశ్వర్యం కిమపి ప్రపద్య కతిచిల్లక్ష్మీకటాక్షోదితం**
**హంత! స్వానభిమన్వతే నిరుపమాన్ కిం నశ్వరైశ్వర్యతః |**
**అత్రాముత్ర చ నిత్యభోగ్యమతులం శ్రీరమ్యయోగీశ్వర**
**శ్రీసూక్త్యాహ్వయశేవధిం నిరవధిం లబ్ధ్వా సుధన్యా వయమ్ ‖ 05 ‖**

కొందరు లక్ష్మీ కటాక్షంవల్ల కొద్దిపాటి సంపదను పొంది, తమ సాటి లేనివారిగా తలచి, గర్వపడుతున్నారు. ఆ సంపదవల్ల ఏమి లాభం? ఉభయవిభూతులలో నిత్యంగా, భోగ్యంగా ఉండేది, అంతులేనిది అయిన నిధి నాకు లభించింది. ఆ నిధికి శ్రీ వరవరముల శ్రీసూక్తి అని పేరు. ఇటువంటి నిధిని పొందిన నేను చాలా ధన్యుడను.

---

**లక్ష్మీశో భగవాన్ పురా రఘుపతిః కృష్ణశ్చ భూత్వా క్షితౌ**
**విశ్వామిత్రముఖేషు శిష్య ఇవ సన్ వైరస్యమేవావహత్ |**
**అర్చాయా మథ సోఽభిరామ మనఘం దివ్యం గురుం దుస్త్యజం**
**ప్రేప్సుః శ్రీ వరయోగినం గురుపదే విన్యస్య ధన్య స్సదా ‖ 06 ‖**

భగవంతుడు పూర్వం శ్రీరాముడుగా, శ్రీకృష్ణుడిగా అవతరించినప్పుడు విశ్వామిత్రుడు, సాందీపుడు మొదలైనవారి దగ్గర శిష్యుడయ్యాడు. వారు జితేంద్రియలు కారని, నిత్యసంసారులు అని తర్వాత తెలిసికొని, "అయ్యో! ఆచార్యత్వపూర్తి లేని వీరినా నేను ఆచార్యులుగా వరించాను!" అని భగవంతుడు మనసులో సంకోచపడ్డాడు. ఆ కొరతను అర్చావతారంలో

తీర్చుకోవాలని తలచి, ఏనాడూ విడువడానికి వీలులేని ఆచార్యులను ఆశ్రయించాలని కోరి, ఆచార్యత్వపూర్తి కలిగిన మణవాళమహామునులను ఆచార్యులుగా వరించి ధన్యుడు అయ్యాడు.

---

**ఏష శ్రీవరయోగిరాడ్విశదవాక్చూడామణిత్వప్రథాం**
**ధత్తే సత్య ముపాధిరేష కలయాఽప్యన్యోచితో నైవ హి |**
**నిస్సందేహావిపర్యయం సులలితం వ్యర్థోక్తివైదేశికం**
**సారస్వాదువచోమయం వివరణం విఖ్యాత మస్యైవ హి || 07 ||**

శ్రీవరవరమునులకు విశదవాక్ శిఖామణి అనే బిరుదు ప్రసిద్ధమైనది. నిజానికి ఈ బిరుదు వీరికి మాత్రమే తగినది, వేరెవ్వరికీ తగినది కాదు. ఎందుకంటే, సందేహం కలగడానికి ఏ మాత్రం అవకాశం లేకుండా, విపరీతమైన అర్థాలు కలుగకుండా, వ్యర్థమైన అర్థాలకు ఏ మాత్రం చోటు లేకుండా, చాలా లలితంగా, చాలా భోగ్యంగా ఉండే శ్రీ సూక్తులతో నిండిన వ్యాఖ్యానాలను అనుగ్రహించారు అనే కీర్తి శ్రీవరవరమునులకు అసాధారణం కదా.

(అథ వా శ్లోకాంతరమ్):

**ఏతత్పథ్యవచో మదీయ మనఘం కర్ణామృతం శ్రూయతాం**
**శ్రీమత్సుందరయోగిన స్సుమధురా సూక్తి స్సదా సేవ్యతామ్ |**
**తత్తాదృగ్గుణశేవధి ర్గురువరో యః కోఽపి వా భూతలే**
**భూతః కిం భవితేతి శుద్ధధిషణై స్సద్భిః క్షణం చింత్యతామ్ || 08 ||**

నేను పలికే హితమైన, ఏ దోషం లేని, చెవులకు ఇంపైన మాటను వినండి. శ్రీవరవరమునుల మధురమైన శ్రీసూక్తులను నిరంతరం సేవించి, ఆనందించండి. ‘వారివంటి ఇంకొక ఆచార్యులు ఇంతవరకు ఈ లోకంలో అవతరించారా? ఇకపై అయినా అవతరించగలరా?’ - అని శుద్ధమైన మనస్సు కలిగినవారలారా!, కొంచెం ఆలోచించి చూడండి.

---

**శాంతిర్దాంతిరితీదృశా గుణగణా ఆవశ్యకా దేహినామ్**
**ఇత్యేవం బహవో లిఖంతి కృతిషు స్వీయాసు గాంభీర్యతః |**
**తత్తాదృగ్గుణసంపదాం నిలయనం కో వా గురు స్స్యాదితి**
**స్వాంతే చింతయతాం మునిర్వరవరో నిత్యప్రతిష్ఠో భవేత్ || 09 ||**

శమం, దమం మొదలైన ఆత్మ గుణాలు జీవులకు తప్పక ఉండాలి—అని పలువురు తమ గ్రంథాలలో గంభీరంగా వ్రాస్తున్నారు. అయితే, ఆ గుణాలకు ఆకరమైన ఆచార్యులు ఎవరు? అని కొందరు విచారించడం ఆరంభిస్తే, వారి మనసులో శ్రీ వరవరమునులు తప్పక స్థిరంగా నిలుస్తారు. వారివలె శమదమాది గుణసంపద కలవారు ఇంకొకరు ఎవరూ లేరు.



మణవాళమామునులు - తిరువహీంద్రపురం

**అంతర్వాణివరా నమత్సరధియ స్సంసేవ్య విజ్ఞాపయే**

**ప్రేక్షధ్వే నను భూయసీ ర్గురువరై స్తైస్తైః ప్రణీతాః కృతీః |**

**శ్రీమద్రమ్యవరోపయంతృమునిరాట్ శ్రీసూక్తిసౌవాదవం**

**కిం కస్యాపి గురూత్తమస్య వచసి ప్రైక్షి స్ఫుటం కథ్యతామ్ ‖ 10 ‖**

అసూయ లేని పండితులను సేవించి ఒక విషయాన్ని విన్నపిస్తున్నాను. మీరు పలువురు ఆచార్యులు రచించిన పలు గ్రంథాలను చూచారు కదా. శ్రీవరవరమునుల శ్రీ సూక్తులలో ఉండే మాధుర్యం ఇక ఏ ఆచార్యుని వాక్కులలో అయినా గమనించారా? స్పష్టంగా చెప్పండి.

---

**దంభం కేవలమేకమేవ వచసా స్వీయేన సందర్శయం-**

**త్యాచార్యా కతిచిత్కిమస్తి ఫణితౌ తేషాం ఋతే దూషణాత్ |**

**భస్మచ్ఛన్న ఇవానలో గురువరో రమ్యోపయంతా ముని**

**స్సాదిష్టై ర్వచనై ర్వినిందనకథావైదేశికై ర్భాసతే ‖ 11 ‖**

కొంతమంది ఆచార్యులు తమ వాక్కుతో దంభాన్ని మాత్రమే వ్యక్తం చేస్తారు. వారి మాటలలో ఇంచుమించుగా పరనింద తప్ప వేరు దేనిని చూడడానికి సాధ్యమవుతుంది? నివురు కప్పిన నిప్పువంటి శ్రీవరవరమునులు ఒక్కరే పరనింద కొంచెం కూడా లేని పరమభోగ్యమైన శ్రీసూక్తులను అనుగ్రహించారు.

---

**అంతర్మానస మన్యదేవ దధతే వాచ్యన్యదేవ బ్రువం-**

**త్యన్యే స్వీయనిబంధనేషు, బహుశో దక్షా అమీ వంచనే |**

**తాదృగ్దుర్గుణగంధలేశవిధురః కాంతోపయంతా మునిః**

**శ్రీరంగేశతపఃఫలం విజయతే సద్భక్తచిత్తే సదా ‖ 12 ‖**

లోకంలో పలువురు తమ మనసులో ఒకటి పెట్టుకొని, వాక్కులో ఇంకొకటిని వ్యక్తం చేస్తూ గ్రంథాలను రచిస్తారు. ఇంచుమించుగా వారు వంచింపగలిగినవారు. అటువంటి

దుర్గుణం కొంచం కూడా లేని మణవాళ మహాములు శ్రీరంగనాధుని తపఃఫలంగా అవతరించారు. వారు ఎల్లప్పుడూ భక్తుల మనసులలో ప్రకాశిస్తున్నారు.

---

**య స్సర్వజ్ఞ ఇతి ప్రసిద్ధి మగమత్ యం రంగరాడాశ్రయత్**
**యేనారక్ష్యత దర్శనం యతిపతేః యస్మై నతిః శ్రేయసీ |**
**యస్మాన్నాస్త్యధికో గురుః భువి చిరం యస్యైవ మంత్రో జయీ**
**యస్మిన్ సంతి సమే గుణా వరవరం యోగీశ్వరం తం స్తుమః ‖ 13 ‖**

ఎవరు సర్వజ్ఞులని అని కీర్తింపబడుతున్నారో, ఎవరిని శ్రీరంగనాధుడు ఆచార్యులుగా ఆశ్రయించాడో, ఎవరిచే రామానుజ దర్శనం రక్షింపబడినదో, ఎవరికోసం చేయబడిన నమస్కారం మంచిని కలిగిస్తుందో, ఎవరికంటే గొప్ప ఆచార్యులు ఇంకొకరు లేరో, ఎవరి స్తుతిశ్లోకం ఈ లోకంలో ఎల్లప్పుడూ విజయాన్ని పొంది వెలుగుతున్నదో, ఎవరిలో అన్ని కళ్యాణగుణాలు ఉన్నాయో, ఆ వరవరములను స్తుతిస్తున్నాము.

**ఈ శ్లోకంలో వరుసగా 7 విభక్తులలో ప్రయోగాలను చేసిన అందం గమనించదగినది.**

---

**ఆకారం వరయోగిన స్సుమధురం క్షీరోదధే స్సోదరం**
**చేతోహారిణ మద్వితీయ మనఘం సేవేత దాసః కదా |**
**ఇత్యేవం సుచిరాద్విచింత్య బహుధా దీనం ధృతాశ్రుం చ మాం**
**హా! హా! యశ్చరితార్థ మాశు కృపయాऽకార్షీత్స యోగీ మహాన్. ‖ 14 ‖**

శ్రీవరవరమునుల పాలసముద్రంవంటి తెల్లని, భోగ్యమైన ఆకారాన్ని నేను ఎప్పుడూ సేవించగలను? - అని చాలా కాలం కన్నీరు విడుస్తూ నేను రోదిస్తున్నాను. ఆ విధంగా బాధపడే నాకు శ్రీవరవరమునులు, అయ్యో! అని జాలి తలచి,తమ రూపాన్ని దర్శింపజేసి, నన్ను కృతార్థుని చేశారు. వారు మహానుభావులు.

---

**పథ్యం కించన వచ్మి కర్ణకుహరే సానందమాకర్ణ్యతాం**

**యస్తత్త్వత్రయటీకయా మహితయా సర్వజ్ఞభావం నిజమ్ |**

**విఖ్యాతం వ్యతనో త్తమేన మతులం కాంతోపయంత్రాహ్వయమ్**

**యోగీంద్రం సతతం నిధత్త హృదయే నాస్త్యన్యతో ధన్యతా || 15 ||**

మీ చెవిలో ఒక మంచి విషయాన్ని చెబుతాను, వినండి. శ్రీ పిళ్లైలోకాచార్యులవారు అనుగ్రహించిన తత్త్వత్రయ గ్రంథానికి చాలా గొప్ప వ్యాఖ్యానాన్ని రచించి, తమ సర్వజ్ఞత్వాన్ని ప్రకాశింపజేసిన శ్రీ వరవరమునులనే నిత్యం ధ్యానించండి. వేరొక దారిలో మీ జన్మ సాఫల్యాన్ని పొందే అవకాశం లేదు.



మణవాళమామునులు - తిరునాంగూర్

---

**ఆకాశే యది విక్షిపంతి పృథుకా జంబాల మేతావతా**

**కిం బోభోతి, నిరీక్షతే కిల జన స్సర్వోఽపి చర్యామిమామ్ |**

**స్యాదేవం నను రమ్యయోగిఫణితిష్వన్యై రథన్యై ర్మృధా**

**నిందావాగ్వితతిర్జడైః ప్రలపితా స్వానర్థదా కేవలమ్ || 16 ||**

చిన్నపిల్లలు బురదను ఎత్తి, ఆకాశంలో ఎగురవేస్తే ఏమవుతుంది? - అనే విషయాన్ని

అందరూ గమనించడంలో అడ్డు లేదు. శ్రీవరవరమునుల విషయంలో కూడా ఈ నియమాన్ని దర్శించవచ్చు. గర్భదరిద్రులు కొందరు శ్రీవరవరమునుల అమృత వచనాలలో దూషణాలను ప్రలపించడం వారికే అనర్థాన్ని కలిగిస్తుంది.

---

**తం తం దేశిక మాదరేణ మహతా తుష్టూషతాం ధీమతామ్**

**ఆచార్యా నపరాన్విహాయ తమిమం సేవధ్వ మిత్యేవ గీః |**

**ప్రాదుర్భావ ముపైతి నైవ మధునా శ్రీరమ్యయోగీశ్వరం**

**స్తౌమ్యేషోఽహ మహో కరోమి శపథం నాన్యో గురు ర్వస్తుతః || 17 ||**

లోకంలో బుద్ధిమంతులు ఆ యా ఆచార్యుల స్తుతించేటప్పుడు, "మిగిలిన ఆచార్యులను విడిచిపెట్టి ఈ ఆచార్యులను సేవించండి" అని పలకడం కనిపిస్తుంది. నేను శ్రీవరవరమునులను స్తుతించడం ఆ క్రమంలో కాదు. నిజానికి వరవరమునులు తప్ప ఇక వేరు ఏ ఆచార్యులు లేరు – అనే విషయాన్ని శపథం చేసి పలుకుతున్నాను.

---

**రంగీ యస్య గుణా న్స్వయం హి సుచిరం సంమృశ్య శిష్యోఽభవత్**

**తస్మిన్ రమ్యవరోపయంతృయమిని ప్రజ్ఞావిరక్త్యర్ణవే |**

**ఆచార్యత్వసమాపనం తు సమభూదిత్యేవ సర్వే విదుః**

**తస్మాదేవ సుధీరమత్ర హి శపే నాన్యోఽస్త్యతో దేశికః || 18 ||**

శ్రీరంగనాథుడు ఏ వరవరమునుల కళ్యాణ గుణాలను చాలా దినాలు పరిశీలించి చూచి శిష్యుడయ్యాడో, ఆ వరవరమునులకు తరువాత ఇక ఏ ఆచార్యులు ఉండకూడదు – అని వారితో ఆచార్య పరంపరను ఆ శ్రీరంగనాథుడు పరిసమాప్తి చేశాడు. అంటే, పూర్వా-చార్యులు అనే పేరు శ్రీవరవరమునులతో పూర్తి అయినది. ఈ విషయం లోకం అంతా తెలిసినదే కనుక, శ్రీవరవరమునులకు మించిన ఆచార్యులు ఇక ఎవరూ లేరు – అని నేను నిశ్చయంగా పలుకుతున్నాను.

---

**అత్యాశ్చర్యమహిష్ఠసూక్తిమహితా మాచార్యచిత్తాహ్వయాం**

**లోకాచార్యసహోదరప్రకథితాం దివ్యాం కృతిం వ్యాకరోత్ |**

**విశ్వఖ్యాతయశా వరో మునివరో వ్యాఖ్యా మిమాం శ్రేయసీం**

**స్వాదిష్ఠాం సతతం నిషేవ్య భజత ప్రాజ్ఞాగ్రగణ్యప్రథామ్ ‖ 19 ‖**

పిళ్లైలోకాచార్యులవారి తమ్ములు అయిన శ్రీ అழகియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన ‘ఆచార్యహృదయం’ అనే దివ్యగ్రంథాన్ని, లోకంలో అంతటా వ్యాపించిన కీర్తిని కల శ్రీ వరవరమునులు వ్యాఖ్యానించారు. చాలా భోగ్యమైన ఆ వ్యాఖ్యానాన్ని నిరంతరం సేవిస్తే సర్వజ్ఞత్వాన్ని పొందవచ్చు.

---

**మందానా మపి హర్ష మప్రతిభటం విశ్రాణయంతీర్గిరో**

**భూయిష్ఠా భువి కేవలం కరుణయా దత్త్వా సముజ్జీవయన్ |**

**ఆచార్యో వరయోగిరాడనుపమో వాత్సల్యవారాంనిధిః**

**ప్రాదాద్యాం యతిరాజవింశతిమిమాం కంఠే కురుధ్వం సదా ‖ 20 ‖**

జ్ఞానం లేనివారికి కూడా సాటి లేని ఆనందాన్ని కలిగించగలిగిన పలు సూక్తులను తమ నిర్హేతుకకృపతో అనుగ్రహించి, లోకాన్ని ఉజ్జీవింపజేసిన శ్రీ వరవరమునులు పలికిన ‘యతిరాజవింశతి’ని కంఠస్థం చేసి, సదా అనుసంధించండి.

---

**ధన్యా స్స్యామ సదేతి యే కుతుకిన స్తై రేతదాకర్ణ్యతాం**

**శ్రీవాగ్భూషణనామకం కృతివరం లోకార్యసందర్శితమ్ |**

**శ్రీమద్రమ్యవరోపయంతృయమిరాడ్వ్యాఖ్యానరత్నాంచితం**

**శశ్వద్దేశికసన్నిధౌ పఠత భో నేతః పరా ధన్యతా ‖ 21 ‖**

"ఎల్లప్పుడు మనం అదృష్టవంతులుగా ఉండాలి" అనే కోరికను కలిగినవారలారా! వినండి. శ్రీ వరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానంతో కూడిన ‘శ్రీ వచనభూషణ’

దివ్యగ్రంథాన్ని మీ ఆచార్యుల సన్నిధిలో మాటిమాటికి సేవించండి. ఇదే గొప్ప భాగ్యం. దీనికి మించిన భాగ్యం లేదు.

---

**ఈర్ష్యాదుర్గుణదూరగం శమదమోదన్వంత మన్యాదృశ—**
**ప్రజ్ఞాశేవధి మప్రమేయవిభవం శ్రీరమ్యయోగీశ్వరమ్ |**
**ముక్త్వాఽన్యం గురు మేకమాశ్రయతి య స్తృప్తి స్తు కా నామ భోః**
**తస్య స్యాత్పరమార్థవేదనకథా న స్యాద్ధి తస్యాయుషి ‖ 22 ‖**

ఇతరుల అభివృద్ధిని చూచి సహించలేక పోవడం అనే అసూయను లేకపోవడాన్ని పొంది, శమదమగుణాలకు సముద్రంమై వెలుగుతున్న శ్రీ వరవరమునులను విడచిపెట్టి, ఇంకొక ఆచార్యులను ఆశ్రయించేవారికి ఏమి తృప్తి కలుగుతుంది? అటువంటివారికి వారి ఆయుస్సు పూర్తి అయ్యేవరకు యథార్థమైన విషయాలను తెలిసే అవకాశం ఉండదు కదా.




మణవాళమామునులు - కంచి

---

**భంగో నైవ కదాపి కుత్రచిదపి శ్రీరమ్యయోగీశితుః**
**మంత్రస్య క్షితిమండలేఽత్ర భవతీత్యేతత్తు తత్త్వం పరమ్ |**
**సమ్యక్ చింతయతాం విశుద్ధమనసాం చిత్తే న తావద్గురుః**
**కోఽప్యన్యో వినిధాతు మర్హతి పదం పశ్యంతు నిర్మత్సరాః ‖ 23 ‖**

శ్రీవరవరమునుల తనియన్ శ్లోకానికి ఈ భూమండలంలో ఏ చోట ఏ సమయంలోనూ భంగం కలుగదు అనే తత్త్వాన్ని చక్కగా తెలియగలిగిన మహాత్ముల మనసులో శ్రీవరవరమునులు తప్ప ఇంకొక ఆచార్యులు పాదం పెట్టగలరా? అసూయను లేనివారు దీనిని ఆలోచించి చూస్తారు గాక!

---

**అన్యాయ్యార్థకదంబాని బహుశో విక్షిప్య నిస్సాధ్వసం**
**నాస్మాభిః క్వచిదప్యపార్థకణికాఽప్యత్రాభ్యధాయీతి చ |**
**సంలిఖ్య ప్రసభం ప్రవంచ్య యశసా తుంగాశ్చ సంతి క్షితౌ**
**సంత్వేతే మునిరేష ఏవ పరమః ప్రామాణికాగ్రేసరః ‖ 24 ‖**

కొందరు తమ గ్రంథాలలో తప్పుగా ఉండే అర్థాలను ఏ సందేహం లేకుండా నిండుగా వ్రాసి, అంతటితో నిలువకుండా "ఇందులో తప్పైన అర్థం ఏమీ లేదు, చాలా ప్రామాణికమైన అర్థాలనే వ్రాశాము" అనే అని వ్రాసి, లోకాన్ని వంచించి, కీర్తిని పొందుతున్నారు. అటువంటివారు ఉంటే ఉండనివ్వండి. శ్రీవరవరమునులు ఒక్కరే ప్రామాణికులలో గొప్పవారు.

---

**కశ్చిన్మామిహ వేత్తి తత్త్వత ఇతి శ్రీవాసుదేవః పురా**
**గీతాయాం నను గాయతి స్మ తదను ప్రాదుర్బభూవ క్షితౌ |**
**శ్రీమద్రమ్యవరోపయంతృయమిరాడేకో గురు స్తత్త్వవిత్**
**తత్సూక్తిప్రవణా వయం చ కతిచిత్తత్త్వజ్ఞభావాస్పదమ్ ‖ 25 ‖**

భగవద్గీతలో శ్రీకృష్ణుడు "కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" అని అంటూ ఎప్పుడో పలికాడు. తనను యథార్థంగా తెలియగలవాడు ఎవడో ఒకడు ఉంటాడు – అనే ఈ గీతావాక్యాను-సారంగా శ్రీ వరవరమునులు ఒక్కరే తత్త్వజ్ఞులై అవతరించారు. వారి శ్రీసూక్తులలో ప్రావణ్యాన్ని కల మనకు కూడా తత్త్వజ్ఞభావన తగినది.

---

**తర్కవ్యాకరణాదితంత్రనిచయే వైదుష్య మన్యాదృశం**
**స్పష్టీకర్తు మలం యదీయవిశదవ్యాఖ్యానవైఖర్యహో ।**
**తేనానేన వరోపయంతృయమినా ప్రోక్తాం రహస్యత్రయ–**
**వ్యాఖ్యాం చింతయ సంతతం హృదయ హే!యద్వైభవం విశ్రుతమ్ ॥ 26 ॥**

తర్కం, వ్యాకరణం మొదలైన సకలశాస్త్రాలలో సాటి లేని పాండిత్యాన్ని స్పష్టంగా చూపగల వ్యాఖ్యానాలను అనుగ్రహించిన శ్రీవరవరమునుల సాటి లేని ముముక్షుప్పడి వ్యాఖ్యానాన్ని, ఓ మనసా! నిరంతరం అనుసంధించు.

---

**యస్య స్వాదువచస్తతిష్వనుపమా ప్రామాణికత్వప్రథా**
**యస్మిన్నార్జవ మద్వితీయ మమితం విభ్రాజతే విశ్రుతమ్ ।**
**యో లోకార్యగురూక్తిరక్షణకృతే జజ్ఞే స రమ్యో మునిః**
**శ్రీరంగేశమనోహరో విజయతే చిత్తే మమైవానిశమ్ ॥ 27 ॥**

తమ పరమమధురమైన శ్రీసూక్తులలో తమ పరమప్రామాణికత్వాన్ని ప్రకాశింపజేసిన-వారు, కుటిలబుద్ధి కాకుండా ఋజువైన బుద్ధిని కలవారు, శ్రీ పిళ్లైలోకాచార్యులవారి సూక్తులను రక్షించడంకోసం అవతరించినవారు, శ్రీరంగనాథుని మనసును కొల్లగొట్టినవారైన శ్రీవరవరమునులు నా మనసు లోపల వేంచేసి ఉన్నారు.

---

**ఆదా వాదిభుజంగమోऽథ సమభవత్సౌమిత్రినామా తః**

**శ్రీరామానుజయోగిరాడుదభవత్పశ్చాద్వరో యోగిరాట్ |**

**ఇత్యేవం హ్యవతారతత్త్వ మఖిలా స్సంతో గృణంతి స్ఫుటం**

**యస్యాచార్యమణేః స ఏష మునిరాడాంధ్యం మమాపాహరత్ ‖ 28 ‖**

మొదట ఆదిశేషుడై ఉండి, తరువాత లక్ష్మణుడుగా, ఆ తరువాత శ్రీరామానుజులుగా, ఆ పిమ్మట శ్రీవరవరమునులుగాను – ఈ విధంగా క్రమంగా ఆదిశేషుడు అవతరించారు– అని సత్పురుషులు వాస్తవాన్ని గ్రహించి పలికే శ్రీవరవరమునులు నా అంతరమైన అంధకారాన్ని పోగొట్టారు.

---

**దక్షా స్సంతి పరశ్శతాః కవివరాః ద్వ్యత్ర క్షణాభ్యంతరే**

**నిర్మాతుం బహుబంధబృందభరితా బహ్వీః కృతీరస్తు తత్ |**

**శ్రీమత్సుందరయోగిదివ్యఫణితిష్వేకాక్షరస్యాగ్రతః**

**నైవ స్థాతు మలం సమస్తకృతయశ్చైకీభవంత్యోऽపి తాః ‖ 29 ‖**

ఆశ్చర్యాన్ని కలిగించే పదబంధాలతో ఓడిన పలు కావ్యాలను క్షణకాలంలో రచించగా కలిగిన గొప్ప కవులు ఈ లోకంలో ఉన్నారు. ఆ విషయం ఉండనివ్వండి. వాటి వల్ల ఏమి ప్రయోజనం? అవి అన్నీ ఒకటిగా కలిసినా శ్రీవరవరమునుల అమృతంవంటి సూక్తులలో ఒక అక్షరానికి కూడా సాటి రావు – అనే విషయం సత్యం.

---

**ఇంధే సంతత మస్మదీయహృదయే రమ్యోపయాంతామునిః**

**దుగ్ధోదధ్యుపమేయసుందరతను స్వచ్ఛప్రభాం భాసయన్ |**

**యా స్వప్నేపి సుదుర్లభా మమ పునర్జాగ్రద్దశాయాం క్వచిత్**

**ప్రాదాదద్భుతదర్శనం దురితరాశ్యున్మూలనం పావనమ్ ‖ 30 ‖**

మణవాళ మహామునులు పాలసముద్రంవంటి తమ దేహకాంతిని నా మనసు లోపల ప్రకాశింప చేస్తూ దర్శనాన్ని అనుగ్రహిస్తున్నారు. కలలో కూడా దర్శించడానికి అరుదైన ఆ రూపదర్శనాన్ని నేను జాగ్రద్దశలోనే దర్శించేటట్లు నన్ను అనుగ్రహించిన ఆశ్చర్యాన్ని ఏమని చెప్పను?

---

**గచ్ఛేయం యది జాతుచిద్దివమహం తత్రాపి రమ్యోపయం–**

**త్రాచార్యస్య పదాంబుజన్మసవిధే సర్వా స్సపర్యా శ్చరన్ |**

**తత్స్వాదూక్తినిషేవణైకరసికో వర్తేయ నోచేద్ధ్రువమ్**

**భిత్త్వా భాస్కరమండలం పునరపి ప్రత్యాగత స్స్యాం భువమ్ ‖ 31 ‖**

ఒకవేళ నేను పరమపదానికి వెళ్ళినట్లయితే, అక్కడ కూడా శ్రీ వరవరమునుల శ్రీచరణాల సమీపంలోనే సకలసేవలను చేస్తూ, వారి తీయని సూక్తులను అనుభవిస్తూ జీవిస్తాను. ఆ విధంగా




మణవాళమామునులు - తిరువెళ్ళరై

అవకాశం లేకపోతే, వెంటనే సూర్యమండలాన్ని చీల్చుకొని తిరిగి మళ్ళీ ఈ భూలోకానికి వచ్చివేస్తాను అనేది నిశ్చయం.

---

**ఉర్వ్యామత్ర జనిర్జుగుప్సితతమేత్యాహు ర్మహాంతోఽఖిలాః**
**దాసస్యాస్య తు చేతసే న ఖలు సా వాగ్రోచతే వస్తుతః |**
**యస్మాదత్ర భువిస్థితోఽప్యహ మహో! రమ్యోపయంతుర్మునేః**
**శ్రీసూక్త్యాహ్వయ మద్వితీయ మమృతం చూషన్సదా హర్షభాక్ ‖ 32 ‖**

అజ్ఞానమయమైన ఈ లోకంలో జన్మ గర్హించదగినది అని పెద్దలు చెప్పినప్పటికీ, ఆ మాట నాకు ఇష్టపడడం లేదు. ఎందుకంటే, నేను ఈ లోకంలో ఉంటూ శ్రీవరవరమునుల దివ్యసూక్తి అనే అమృతాన్ని పానం చేస్తూ, ఎల్లప్పుడూ ఆనందాన్ని కలిగినవాడనుగా ఉన్నాను కదా. దుఃఖం కలిగితే కదా ఈ లోకంలోని జీవనం గర్హించదగినది అవుతుంది.

**(అథ వా శ్లోకాంతరమ్)**

**ఉక్తం యచ్ఛఠవైరిణా భగవతా నశ్యేత్కలిః పశ్యతే-**
**త్యామ్నాయే స్వసమీక్షితే, యతిపతేర్దృష్ట్యా తదిత్యుచ్యతే |**
**స శ్రీమాన్యతిరాడ్వరో మునివరో భూత్వా స్వకృత్యం పునః**
**నిశ్శేషం ప్రసమాప్య తాం శఠజిత స్సూక్తిం యథార్థాం వ్యధాత్ ‖ 33 ‖**

నమ్మాళ్వార్లు తమ తిరువాయ్ మొళి ప్రబంధంలో "కలియుమ్ కెడుమ్ కండుకొణ్ మిన్" అని పలకడం భగవద్రామానుజను ఉద్దేశించి అని పెద్దలు అంటారు. ఆ రామానుజులు మళ్ళీ తిరిగి శ్రీవరవరమునులుగా అవతరించి కలిని ధ్వంసం చేయడం అనే తమ కృత్యాన్ని ఏ కొరత లేకుండా పూర్తిచేసి, ఆ ఆళ్వార్ల సూక్తిని నిజం చేశారు.

---

**ణత్వం యాతి నకార ఏవమయతే షత్వం సకార క్వచిత్**
**కిం భూయః కథనేన? పాణినిమునే స్తంత్రే బహుర్వ్యత్యయః |**

**దృశ్యేత ప్రథితప్రభావవరయోగీంద్రోక్తిరత్నాకరే**
**నైవ వ్యత్యయగంధలేశకణికాऽప్యాలక్ష్యతే లక్ష్యతామ్ ‖ 34 ‖**

పాణిని రచించిన వ్యాకరణ శాస్త్రంలో పలు విధాలైన విపరీతాలు కనిపిస్తాయి. నకారం - మకారంగా మారుతుంది, సకారం - షకారంగా మారుతుంది, అని పలు విధాలైన మార్పులు ఆ శాస్త్రంలో చెప్పబడ్డాయి. (నయతియ — ప్రణయతి సహతే— విషహతే అని మొదలైన ప్రయోగాలు దీనికి ఉదాహరణలు). శ్రీవరవరమునుల సూక్తులలో అయితే ఈ విధంగా ఏ విధమైన విపరీతాలు కనిపించవు. చెప్పినది అంతా యదార్థంగానే ఉంటుంది. ఇది చాటూక్తి.

---

**ఆవేశం సకలాశ్చ సూరిమణయః కాసారముఖ్యా స్తథా**
**నాథాద్యా గురవశ్చ సత్యమదధుః శ్రీరమ్యయోగీశ్వరే |**
**యద్వా ద్రావిడసంస్కృతాగమతతీసౌభాగ్యసర్వస్వమ–**
**ప్యేవం కామపి మూర్తి ముద్వహదుదైదిత్యేవ నిర్ధార్యతామ్ ‖ 35 ‖**

సరోయోగి మొదలైన ఆళ్వార్లు అందరూ, శ్రీ నాథమునులు మొదలైన పూర్వాచార్యులు అందరూ శ్రీ వరవరమునులలో ఆవేశించారు అని చెప్పవచ్చు. లేకపోతే, సంస్కృత ద్రావిడ వేదాల భాగ్యం అంతా ఒకటిగా చేరి, శ్రీవరవరమునుల రూపాన్ని ధరించి ఉదయించింది అని నిష్కర్షించడంలో లోటు లేదు.

---

**రంగాధీశ్వరభాగ్యసంతతిరహో రమ్యోపయంతా యమీ–**
**త్యాఖ్యాం లోకవిలక్షణాం సుమధురాం సంగృహ్య జజ్ఞే భువి |**
**ఇత్యేషా ప్రతిపత్తిరేవ మనసి ప్రోజ్జృంభతే మామకే**
**భూయిష్ఠాऽ స్త్వుపపత్తి రత్ర నియతం సిద్ధాంత ఏషో ऽనఘః ‖ 36 ‖**

శ్రీరంగనాథుని భాగ్యపరంపరే శ్రీ వరవరమునుల పేరును పొంది, లోకంలో అవతరించింది అనే ప్రతిపత్తి నా మనసులో ప్రకాశిస్తున్నది. ఈ విషయంలో అధికమైన ఉపపత్తి ఉన్నందున ఇదే దృఢమైన సిద్ధాంతంగా చెప్పవచ్చు.

---

**ణత్వం బాధత ఇత్యువాచ విబుధః కోఽపీతి యః పప్రథే**
**తస్య శ్రీమతి మాధవే హృదయగం వైరం ప్రసిద్ధం బత |**
**తాదృక్షం వరయోగి వర్యచరణద్వంద్వేఽపి యే బిభ్రతే**
**విద్వాంసోఽపి భవంతు తే కిము తతః? శోచ్యా హి తేషాం గతిః ‖ 37 ‖**

మహావిద్వాంసుడు అని పేరు పొందిన అప్పయ్య దీక్షితులు నారాయణ నామాన్ని శివ పరంగా అన్వయించాలి అని శ్రమపడి, "ణత్వం బాధిస్తూ ఉన్నది" అని పలికి తమ ప్రయత్నాన్ని విరమించారు - అనేది ప్రసిద్ధమైన విషయం. వారికి శ్రీమన్నారాయణుని విషయంలో ఉండే ద్వేషం లోక ప్రసిద్ధమే. అందువల్ల నారాయణునకు ఏ కొరతా కలుగలేదు. ఈ విధంగానే పండితులని పేరు పొందిన కొందరు శ్రీవరవరమునుల విషయంలో మాత్సర్యం కలిగినవారైనంత మాత్రంతో శ్రీ వరవరమునులకు ఏ కొరతా లేదు. వారు పడే పాట్లు చెప్పడానికి సాధ్యం కానివి.

---

**అల్పీయానహ మద్వితీయయశసం శ్రీరమ్యయోగీశ్వరం**
**స్తుత్యం భక్తిఘనైః స్తువన్ననుదినం జిహ్రేమి నైవాల్పశః |**
**యస్మాదస్య గురూత్తమస్య సకలం మాహాత్మ్యసారం క్షితౌ**
**అస్యాం దాసజనోఽయమేవ విశదం విజ్ఞాతుమర్హోఽభవత్ ‖ 38 ‖**

లోకం అంతా వ్యాపించిన కీర్తిని కల శ్రీ వరవరమునులను గొప్ప భక్తిని కల మహానుభావులు స్తుతించాలి తప్ప, నీచుడను, ఏ యోగ్యత లేనివాడను అయినా నేను స్తుతించడం తగినది కాదు. అయినా నేను విరమించకుండా నిరంతరం వారిని స్తుతిస్తున్నాను.

దీనికోసం నేను కొంచెం కూడా సిగ్గు పడడం లేదు. ఎందుకంటే, శ్రీ వరవరమునుల సకల వైభవాలను ఉన్నది ఉన్నట్లుగా తెలియడంలో ఈ లోకంలో నేను ఒక్కడినే ఆ భాగ్యాన్ని పొందాను.

---

**వల్లీతుల్యవలగ్నశాలి లలనాశ్లేషాదిభోగే సుఖం**

**జాగర్తీత్యభిమన్వతే జడజనాః క్షుద్రం హి తేషాం సుఖమ్ |**

**శ్రీరంగేశగురూత్తమస్య యమినః శ్రీసూక్తిరత్నాకరే**

**గాహం గాహ మశేషభోగఫలితాన్ హర్షాన్భజామో వయమ్ || 39 ||**

తీగవలె సన్నని నడుమును కల స్త్రీలను ఆలింగనం చేసుకుంటే ఆనందం కలుగుతుంది అని నీచులు భావిస్తారు. వారికి ఆనందం కలిగితే కలగనీ. అయితే, ఆ ఆనందం చాలా అల్పమైనది. శ్రీరంగనాథుని ఆచార్యులైన శ్రీవరవరమునుల శ్రీసూక్తిసాగరంలో మునిగి, ఆనందించి, లోకంలోని సకలవిధ భోగాలలోను కలిగే అన్ని విధాలైన ఆనందాలను మనం పొందుదాము.



మణవాళమామునులు - వానమామలై

---

**అన్యాన్యేష్వమితేషు లౌకికతయా ఖ్యాతేషు కార్యోత్కరే–**

**ష్వాసక్త్యా విగలత్యహో బహుతమః కాలో వృథా దేహినామ్ |**

**స్వామిన్! సుందరయోగివర్య! భవతః పాదాబ్జయోః ప్రార్థయే**

**భావత్సూక్తినిషేవణైకరసికః కాలం నయేయం నిజమ్ || 40 ||**

లోకంలో ఒక్కొక్కరికి లౌకికమైన పలు విధాలైన కార్యాలు ఉన్నందున, వారు వాటిలో కాలక్షేపం చేయడం సంభవించి, ఎక్కువ కాలం ఆ విధంగా వ్యర్థంగానే గడిచిపోతున్నది. శ్రీ వరవరమునీ! దాసునకు ఆ విధంగా కాకుండా, తమ దివ్యసూక్తులతోనే సదా కాలం అంతా గడిచేటట్లు అనుగ్రహించాలి – అని శ్రీచరణసన్నిధిలో ప్రార్థిస్తున్నాను.

---

**మంజీరాంచితపాదయుగ్మవనితాసంచారకాలోదిత–**

**ధ్వన్యాకర్ణనవిహ్వలాః కతిపయే ముహ్యంతి ముహ్యంతు తే |**

**వ్యామోహో మమ తు ప్రసిద్ధ్యతితమాం శ్రీరమ్యయోగీశితుః**

**మంత్రోద్ఘోషణకాలికధ్వనివిశేషాకర్ణనోజ్జృంభితః || 41 ||**

స్త్రీలు తమ పాదాలకు మంజీరాలను అలంకరించుకుని నడిచేటప్పుడు ఆ మంజీరాల ధ్వనిని విని, వ్యామోహాన్ని పొందేవారు లోకంలో ఉంటే ఉండనీ. శ్రీవరవరమునుల తనియన్ ను గోష్ఠిలో పెద్ద స్వరంతో అనుసంధించినపుడు ఏర్పడే ధ్వనివిశేషాన్ని విన్నప్పుడు నేను వ్యామోహాన్ని పొందడం ప్రసిద్ధం.

(తనియన్ లో పూర్వార్ధం ముగిసింది)

## ఉత్తరార్ధమ్

**యస్య స్యాదిహ మానసే సుకృతినః పుంస స్సదా పావనం**
**శ్రీమత్కాంతవరోపయంతృయమిరాణ్మూర్తేశ్శుభం చింతనమ్ |**
**తస్య స్యాదనఘా మతిర్యతిపతే స్సందర్శనే నిస్తులా**
**కిం భూయః కథనేన? తత్త్వమఖిలం జ్ఞాతుం స ఏవార్హతి || 42 ||**

శ్రీ వరవరమునుల పరమపవిత్రమైన అందాన్ని ధ్యానించే భాగ్యం కలవారికి శ్రీరామానుజుల దర్శనంలో మంచి జ్ఞానం కలుగుతుంది. సకల తత్త్వాలను యథార్థంగా తెలియగలిగిన యోగ్యత వారికి లభిస్తుంది.

**(అథ వా శ్లోకాంతరమ్)**

**యద్యప్యత్ర శఠారినాథమునిరాట్ శ్రీయామునశ్రీయతి–**
**క్ష్మాభృద్భట్టపరాశరాదిగురవోఽప్యత్యంతభక్త్యాస్పదమ్ |**
**జాగ్రత్యేవ తథాఽపి మే విశదవాక్చూడామణౌ సుందరే**
**యోగీంద్రే తు విలక్షణా నవనవా భక్తి స్సముజ్జృంభతే || 43 ||**

ఈ లోకంలో నమ్మాళ్వారులు, నాథమునులు, యామునులు, శ్రీ రామానుజులు, భట్టర్ మొదలైన ఆచార్యులు మన భక్తికి విషయంగా ప్రకాశిస్తున్నప్పటికీ, దాసునకు విశదవాక్ శిఖామణి అయిన శ్రీ వరవరమునుల విషయంలో మాత్రమే విలక్షణమైన నిత్యనూతనమైన భక్తి ప్రకాశిస్తున్నది.

---

**అధ్వానం వరయోగినా సుమనసా సందర్శితం భేజుషాం**
**తత్త్వార్థేషు విశుద్ధధీవిలసితం విద్యోతితం విశ్రుతమ్ |**
**తస్మిన్నధ్వని పావనే విముఖతాం యే బిభ్రతి క్షుల్లకాః**

**తేషాం శోచ్యదశాం కథం ను కథయై ధిగ్జన్మ తేషామిహ ‖ 44 ‖**

మణవాళ మహామునులు చూపించిన పద్ధతిని ఆశ్రయించినవారికి తత్త్వార్థాలలో పవిత్రమైన, చక్కని జ్ఞానం ప్రకాశించడం ప్రసిద్ధం. దౌర్భాగ్యంవశంవల్ల ఆ మంచి మార్గంలో విముఖులై ఉన్నవారు పడే పాట్లను ఏమని చెప్పను? వారి జన్మయే గర్హించదగినది.

---

**తన్యాన్నిస్తులవైభవో వరమునిః ప్రేమాత్మికాం శేముషీమ్**

**ఆత్మీయానఘదివ్యసూక్తివిముఖ్యేష్వప్యంజసేత్యర్థయే |**

**నైవం చేదహహా! ప్రకామ ముదియాత్ శ్రీవైష్ణవానాం సతాం**

**తేషాం దుర్గతి సంతతిః కథమిదం సహ్యం భవేన్మాదృశామ్ ‖ 45 ‖**

శ్రీ వరవరమునులు తమ దివ్యసూక్తులలో విముక్తులై ఉండేవారికి కూడా ప్రేమ కలిగేటట్లు దయ చూపాలి - అని నేను ప్రార్థిస్తున్నాను. ఎందుకంటే, శ్రీ వైష్ణవులుగా పుట్టి, శ్రీవరవరమునుల శ్రీసూక్తులలో అసూయను కలిగి ఉండేవారికి నిరంతరం దుఃఖమే కదా కలుగుతుంది. శ్రీవైష్ణవులకు దుఃఖం కలుగుతుంది అంటే ఈ దుఃఖం సహించదగినది కాదు కదా. ఇందువల్ల చెడ్డవారినికూడా మంచి స్వభావం కలిగినవారుగా శ్రీవరవరమునులు అనుగ్రహించాలి.

---

**ఈషద్భక్తిరలంతరాం వరమునేః శ్రీ పాదపంకేరుహే**

**తావత్యా పరమార్థతత్త్వ మఖిలం నిస్సంశయం భాస్యతి |**

**ఏవం ద్వేషలవోఽప్యలం నిపతనాయోచ్చావచే నారకే**

**హాహా! తత్త్వమిదం విదన్నపి జనో భూయాన్ వినాశోన్ముఖః ‖ 46 ‖**

మనవాళ్ళ మహామునుల శ్రీచరణాలలో స్వల్పమైన భక్తి ఉన్నా, అది పరమార్థాలను యథాతథంగా తెలియడానికి చాలు, ఈ విధంగానే, శ్రీవరవరమునుల విషయంలో కొంచెం

అసూయ కలిగి ఉన్నా, అది పలు విధాలైన క్రూరనరకాలలో మునిగి బాధపడడానికి చాలు. ఈ వాస్తవాన్ని తెలిసినా, నశించిపోవాలని అనుకునేవారు అనేకులు ఉన్నారే! అయ్యో!

---

**నత్వా శ్రీ వరపాదయోగికమలం మూర్ధాఽశ్నుతే ధన్యతాం**
**స్తుత్వా తస్య మునేర్గుణాన్ శుభతమాన్ జిహ్వా కృతార్థా పరమ్ |**
**స్మృత్వా తస్య వచాంసి పావనతమం బోభోతి మే మానసం**
**పాణి స్తస్య యశో విలిఖ్య విపులం కార్తార్థ్య మాసేవతే || 47 ||**

దాసుని శిరస్సు శ్రీవరవరమునుల శ్రీచరణాలను నమస్కరించి ధన్యమవుతున్నది. వాక్కు వారి కళ్యాణ గుణాలను స్తుతించి కృతార్థతను పొందుతున్నది. మనసు వారి సూక్తులను చింతించి పవిత్రమవుతున్నది. చేయి వారి విస్తృతమైన కీర్తిని వ్రాసి సత్తను పొందుతున్నది.



మణవాళమామునులు – మన్నార్గుడి

---

**దత్తే రమ్యవరోపయంతృయమినః శ్రీసూక్తిరత్నాకరః**
**భక్తానాం శ్రియ ముత్తమాం గుణమణీన్స్వాదూపదేశోర్మికాః |**
**నిత్యం శుద్ధయశోమయం శశధరం జ్ఞానాఖ్యకల్పద్రుమం**
**త్రయ్యంతార్థమయీం సుధాం పరమతధ్వంసోక్తిహాలాహలమ్ ‖ 48 ‖**

శ్రీవరవరమునుల శ్రీసూక్తి నిజానికి సముద్రం అనదగినది. సముద్రం చేసే పనులను అన్నిటిని ఇది చేస్తున్నది. ఆ సముద్రం లక్ష్మిని ప్రసవించింది. ఈ సూక్తి సముద్రం భక్తులకు గొప్ప సంపదను ఇస్తున్నది. ఆ సముద్రం రత్నాలను ఇస్తున్నది. ఈ సూక్తిసముద్రం సద్గుణాలు అనే రత్నాలను ఇస్తున్నది. (మణవాళ మహామునుల సూక్తులను అభ్యసించేవారికి సద్గుణాలు కలుగుతాయి) ఆ సముద్రం అలలను కలిగి ఉంటుంది. ఈ సూక్తిసముద్రం 'మధురమైన ఉపదేశాలు' అనే తరంగాలను కలిగి ఉంటుంది. ఆ సముద్రం చంద్రుని ఇస్తుంది. ఈ సూక్తిసముద్రం కూడా గొప్ప కీర్తి అనే చంద్రుని ఇస్తుంది. (శ్రీ వరవరమునుల సూక్తులను అభ్యసించేవారికి మంచి కీర్తి కలుగుతుంది అని భావం). ఆ సముద్రం కల్పవృక్షాన్ని ప్రసవించింది.




మణవాళమామునులు - నరసాపురం, ఆంధ్రప్రదేశ్

ఈ సూక్తిసముద్రం జ్ఞానమనే కల్పవృక్షాన్ని ప్రసవిస్తుంది. ఆ సముద్రం అమృతాన్ని ఇవ్వగలిగినది. ఈ సూక్తి సముద్రం వేదాంత రహస్యార్థాలు అనే అమృతాన్ని ఇవ్వగలిగినది. ఆ సముద్రం హాలాహలం అనే విషాన్ని పుట్టించింది, ఈ సూక్తి సముద్రం తత్త్వత్రయవ్యాఖ్యానాలలో పరమత నిరాకరణ చేసే సూక్తులు అనే హాలాహలాన్ని ఇస్తుంది. ఈ విధంగా శ్రీవరవరమునుల శ్రీ సూక్తులు సముద్రం వంటివి (ఇతర మతాలను ధ్వంసం చేసే సూక్తులు భక్తులకు అమృతమే అయినా, ఇతరుల దృష్టిలో అవి హాలాహలంవంటివి).

---

**రక్షాయాం నిపుణో రమాపతిరితి ఖ్యాతిర్వృథైవోదితా**
**సత్యం రక్షతి సంతతం వరమునిః కాంతోపయంత్రైవ నః |**
**ఇష్టప్రాప్తి మనిష్టభంగమపి యత్సూక్త్యా వయం ప్రాప్నుమః**
**శ్రీమానేష మునీశ్వరో హి భవినా మైకాంత్యతో రక్షకః ‖ 49 ‖**

రక్షించడంలో లక్ష్మీపతి సమర్థుడు అనే ఒక ప్రసిద్ధి వ్యర్థంగానే వ్యాపించింది. నిజానికి శ్రీవరవరమునులే మనలను రక్షింపగలవారు. ఇష్టప్రాప్తిని, అనిష్టనివారణాన్ని చేసేవారే రక్షకులు కనుక, మణవాళ మహామునులు తమ శ్రీసూక్తులతో ఈ రెండిటిని చేసి, సంసారులను చక్కగా రక్షిస్తున్నారు.

---

**అంధానాం రవిరశ్మిభి ర్నఫల మిత్యేతావతా భాస్కరే**
**కో దోషో లభతేఽవకాశ మహహ న్యాయోఽయ మత్రాక్షతః |**
**దౌర్భాగ్యాత్ హతచేతసాం వరమునేః శ్రీసూక్తిభిః కించిద–**
**ప్యాసీన్నో ఫలమిత్యతః కిము హతం? ధన్యాన్ సతః పశ్యత ‖ 50 ‖**

గుడ్డివారికి సూర్యకిరణాలవల్ల ఏ ప్రయోజనం లేదు అని అన్నంత మాత్రంతో సూర్యునకు ఏదైనా దోషం కలుగుతుందా? అదేవిధంగా, గర్భదరిద్రులైన కొందరు శ్రీ వరవరమునుల సూక్తులతో ప్రయోజనం పొందకపోతే దానివల్ల ఏమి నష్టం? వారి సూక్తులను అనుభవించి తరించే పవిత్రులైన ధన్యులను చూచి ఈ విషయాన్ని తెలియవచ్చు.

---

**పర్జన్యో జలరాశితః కటు జలం పీత్వా యథా వర్షతి**
**స్వాదిష్టం నను తద్వదేవ భగవాన్ సౌమ్యోపయంతా మునిః |**
**శాస్త్రాబ్ధేరమితాన్ ప్రగృహ్య విషయాన్ సౌవాదవేన స్వయం**
**వర్షన్ సాధు నిపాయయత్యనవధీన్ సౌభాగ్యసీమ్ని స్థితాన్ ‖ 51 ‖**

మేఘం సముద్రజలాన్ని తాగి, చాలా తీయని జలంగా వర్షించినట్లు, శ్రీమణవాళ మహాముని కూడా శాస్త్రాలనే సముద్రంనుండి అంతు లేని గొప్ప విషయాలను గ్రహించి, వాటిని అతిమధురంగా వర్షించి, భాగ్యవంతులు అనేకులు అనుభవించి ఆనందించేటట్లు చేస్తున్నారు.

---

**రక్షాపేక్షణమాత్రకాంక్షిణి హరౌ న స్వాధనానుష్ఠితిః**
**నౌచిత్యం వహతీతి లోకగురురాట్సూక్తిం సముల్లాసయన్ |**
**శ్రీమత్కాంతవరోపయంతృయమినః శ్రీసూక్తిరత్నోత్కరః**
**శ్రీరామానుజసంప్రదాయసరణేరుచ్చైః ప్రదీపాయతే ‖ 52 ‖**

"సర్వజ్ఞోపి హి సర్వేశః సదా కారుణికోపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అనే విధంగా ‘రక్షించాలి’ అనే అపేక్షను మాత్రమే భగవంతుడు ఎదురు చూస్తాడు కనుక, మనం విస్తృతంగా ఏ సాధనాన్ని అనుష్ఠించనక్కరలేదు — అనే శ్రీ పిళ్లైలోకాచార్యులవారి సూక్తిని చక్కగా వివరించే శ్రీ వరవరమునుల శ్రీసూక్తిరత్నం భగవద్రామానుజుల దర్శనానికి గొప్ప మణిదీపంవలె ఉన్నది.

---

**అంతర్ధ్వాంత మపాసితుం క్షితితలే జ్ఞానప్రదీపాదృతే**
**నాన్యత్కించన సాధనం లసతి తం దీపం వరో యోగిరాట్ |**
**ఏకాకీ స్వయ మప్రమేయకృపయా ప్రాదాత్తథాఽప్యంజసా**
**తస్మిన్ హా! శలభీభవంతి చపలాః కిం బ్రూమహే తద్గతిమ్ ‖ 53 ‖**

మనస్సులోని అజ్ఞానాన్ని పోగొట్టడంకోసం లోకంలో జ్ఞానదీపం తప్ప వేరొక సాధనం ఏదీ లేదు – అనే విషయం నిర్వివాదం. అటువంటి అందమైన దీపాన్ని మధురమైన కృపతో




**శ్రీ పిళ్ళైలోకాచార్యులు, మణవాళమామునులు – తిరునీర్మలై**

వెలిగించి మనకు ఇచ్చినవారు శ్రీ వరవరమునులు ఒక్కరే. అయినా, అయ్యో! ఆ దీపంలో పడి మిడతలై నశించేవారికి కలిగే దుర్గతినిగూర్చి ఏమని చెప్పగలం?

---

**వందే సుందరయోగివర్యచరణద్వంద్వం సమస్తార్థదం**

**యే కేచిద్బహులాన్ నిబంధనివహాన్ క్షుద్రభ్రమోత్పాదకాన్ |**

**నిర్మాయ ప్రతివంచయంతి భువనం తేషాం వచో రాశిభిః**

**దాసస్యాస్య మనః కదాఽపి వికృతిం మా నామ విందత్వితి ‖ 54 ‖**

క్షుద్రులకు వ్యామోహాన్ని కలిగించే పలు గ్రంథాలను వ్రాసి, లోకాన్ని వంచించేవారు అనేకులు ఉన్నారు. వారి మాటలతో దాసుని మనస్సులో ఏ సమయంలోనూ వికారం కలగకూడదు — అని శ్రీ మణవాళ మహామునుల చరణాలలో ప్రార్థిస్తున్నాను.

---

**అబ్ధిర్లంఘిత ఏవ వానరభటై రిత్యుక్తరీత్యా భువి**

**ప్రాయ స్సంతి మహా బుధా అపి న తే సారం తు సారస్వతమ్ |**

**జానంతి ప్రకటం బ్రవీమి సకలం శాస్త్రార్థసారం విదన్**

**ఏకాకీ జయతి క్షితౌ వరవరో యోగీశ్వరో నేతరః || 55 ||**

"అబ్ధిః లంఘిత ఏవ వానరభటైః" అని మురారి కవి పలికిన రీతిలో సముద్రాన్ని దాటిన వానర వీరులు సముద్రంలోని లోతును తెలియలేనట్లుగా, లోకంలో పండితులని పేరుపడినవారు అందరూ విషయాలను పైపైన తెలిసినవారే తప్ప, శాస్త్రార్థాలను లోపల ప్రవేశించి లోతుగా తెలిసినవారు కారు. శ్రీవరవరమునులు ఒక్కరే లోతుగా అవగాహించినవారు అని దృఢంగా పలుకుతాను.

---

**ఋక్ష–స్త్రృక్ష–గతౌ శశ–ప్లుతగతౌ శూప్ర –ప్రసూతౌ శ్వితా –**

**వర్ణే పక్షపరిగ్రహే పడి–గతా విత్యాది ధాతూన్ సదా |**

**జల్పంజల్ప మశేష మాయు రహహా! వ్యర్థం క్షిపంతో జడాః**

**శ్రీసూక్తీ ర్న విదంతి కాంతయమినో వైకుంఠవైదేశికాః || 56 ||**

"ఋక్షస్త్రృక్ష–గతౌ", "శశ–ప్లుక్షగతౌ" అని ఈ విధంగా దాదాపు పాఠాలను కంఠస్థం చేసి కాలాన్ని వ్యర్థంగా గడిపే మందబుద్ధులు, అయ్యో! శ్రీవరవరమునుల శ్రీసూక్తులను తెలియడంలేదే! మంచి గతికి దారిని అన్వేషించడం లేదే!



మణవాళమామునులు - పరమేశ్వర విణ్ణగరం

---

**అంత స్సర్వపదార్థసంతతిషు చ వ్యాప్తస్య విష్ణోర్హరేః**
**పూర్తిర్నామ సమాప్య వృత్తిరితి నేత్యన్యాయ్యవాదోత్సుకాన్ |**
**లక్ష్మీనాథవిచిత్రశక్త్యసహనాన్ స్వోక్త్యా విధూన్వన్మునిః**
**శ్రీమత్కాంతవరోపయంతృగురురాడేక స్సతా మగ్రణీః || 57 ||**

సకలపదార్థాలలో లోపల బయట వ్యాపించి ఉండే భగవంతుని వ్యాప్తి అనేది ప్రతి వస్తువులోనూ పరిసమాప్య అంతట వ్యాపించి ఉండేది కాదు – అని వాదించేవారు, భగవంతుని విచిత్రశక్తిని సహించనివారు అయిన ఇతరులను తమ శ్రీసూక్తులతో ఓడించే శ్రీవరవరమునులు గొప్పవారిలో అగ్రగణ్యులు.

---

**మన్యంతే వరయోగినం యతిపతేరేవావతారం పరం**

**వ్యాఖ్యారూపకృతీర్విశేషత ఇహ ప్రాయచ్ఛతాం ద్వావపి |**

**వ్యర్థాం దూషణహాస్యవాచ మపి నో విన్యస్యతః సర్వథా**

**ద్వావేతా వవిభిన్నశీలసుభగా విత్యేవ నిశ్చప్రచమ్ ‖ 58 ‖**

మణవాళ మహామునులు భగవద్రామానుజుల ఇంకొక అవతారమే. ఇంచుమించుగా వ్యాఖ్యానరూపాలైన గ్రంథాలనే అనుగ్రహించడం, వ్యర్థమైన దూషణ పరిహాసవాక్కులను పలుకకుండా ఉండడం – అనే ఈ స్వభావాలు రెండు ఈ ఆచార్యుల విషయంలోనే చక్కగా పొసగి ఉన్నందున దీనిని నిర్ణయించవచ్చు.

---

**వర్ధిష్ణూన్ ప్రతి బోధయేయ మధునా చిత్తభ్రమోత్పాదనే –**

**ష్వన్యాన్యేషు నిబంధరాశిషు వృథా కాలక్షయో నోచితః |**

**ద్రాక్షాపాకనిదర్శనాని లలితాన్యాశ్చర్యవాగ్గుంభనా-**

**న్యాచార్యస్య వరోపయంతృ యమినః సేవధ్వ మేకాంతః ‖ 59 ‖**

ఇంకా ఇంకా జ్ఞానవృద్ధిని పొందాలి అని కోరేవారికి ఒక విషయాన్ని తెలుపుతున్నాను. చిత్తభ్రమ కలిగించే పలు విధాలైన గ్రంథాలలో వ్యర్థంగా కాలం గడపడం మంచిది కాదు. ద్రాక్షపాకానికి నిదర్శనంగా ఉండే శ్రీవరవరమునుల అద్భుతలలిత దివ్యసూక్తులను నిరంతరం అనుభవించండి.

---

**అంత స్సంతత మేక ఏవ భగవాన్ కాంతోపయంతా మునిః**

**కాంతం మంగళవిగ్రహం విశదయన్ ప్రీణాతి మే మానసమ్ |**

**నైవావ్యస్య గురో ర్వరేరపి చ వాఽత్రాస్తేఽవకాశో ధ్రువం**

**ధన్యోఽహం న సమోఽస్తి మే న చ సమో నాన్య స్సమో భూతలే ‖ 60 ‖**

నా మనసు లోపల మణవాళ మహామునులు ఒక్కరే తన దివ్యకాంతిని ప్రకాశింపజేస్తూ నా మనసును ఆనందింప జేస్తున్నారు. వేరొక ఆచార్యులకు కానీ, భగవంతునకు కానీ చోటు లేదు. నాతో సాటి వచ్చేవారు లేరు, నాతో సాటి వచ్చేవారు లేరు.



మణవాళమామునులు – శీక్కిల్ కిడారమ్

---

**నక్షత్రేశసమానమానన మథ జ్యోత్స్నాసదృక్షం స్మితం**

**కర్ణాంతోల్లలితే దృశౌ వకులభృత్సూక్త్యుజ్జ్వలం చాధరమ్ |**

**చేతోహారివిచిత్రపుండ్రసుభగం గాత్రం చ యోగీంద్ర! తే**

**యే ప్రైక్షంత సమక్షతో ధ్రువ మమీ ధన్యా స్సుధన్యా నరాః || 61 ||**

మణవాళ మహామునీ! దేవరవారి చంద్రునివంటి ముఖమండలాన్ని, వెన్నెలవంటి చిరునవ్వును, చెవులవరకు దీర్ఘంగా వ్యాపించిన నేత్రాలను, తిరువాయ్ మొழி ప్రబంధ గంధాన్ని వీచే అధరాన్ని, దివ్యమైన ఊర్ధ్వ పుండ్రాలతో అందమైన తిరుమేనిని నేరుగా సేవించగలిగినవారే భాగ్యవంతులు.

---

**దత్తే నిశ్చలభక్తి మాత్మపదయోర్ధత్తే విరక్తిం మునిః**
**చిత్తేసంతతసన్నిధానకరణాత్ విత్తేషణాం లుంపతి |**
**విత్తేశాదిపదాన్యవాప్తుమపి భో! హృత్తే రుచిర్మాస్మ భూత్**
**ధిక్ తే దుర్విషయేషు ధావనరుచిం మత్తేభవన్మా చర || 62 ||**

మణవాళ మహామునులు నా మనసు లోపల సదా వేంచేసి ఉండి ,తమ శ్రీచరణాలలో స్థిరమైన భక్తిని నాకు ఇచ్చారు. విరక్తిని కలిగించారు. ధనంలోని ఆశను పోగొట్టారు. ఓ మనసా! కుబేరాదిపదవులను పొందాలని నీవు ఆశపడవద్దు. విషయాంతరాలలో పరుగెత్తాలని భావించవద్దు. మదగజం వలె కనబడిన చోట అంతా సంచరించకు. మణవాళ మహామునులలోనే స్థిరంగా నిలచి ఉండు.

---

**ఏరండోఽపి ద్రుమాయత ఇతి న్యాయేన యః కశ్చిద–**
**ప్యార్యో విందతి తత్ర తత్ర సహసైవాచార్యపీఠాంచనమ్ |**
**ఆచార్యత్వ మిహైవ శక్తి మనఘాం ప్రాప్నోతి నిస్సంశయం**
**శ్రీమత్సుందరయోగినీత్యహిఘటే హస్తం ప్రసార్య బ్రువై || 63 ||**

"నిరస్తపాదపే దేశే హ్యేరండోఽపి ద్రుమాయతే" (చెట్లు లేని దేశంలో ఆముదంచెట్టే పెద్ద చెట్టు) అనే విధంగా అక్కడ అక్కడ పలువురు ఆచార్యపీఠంలో వేంచేసి ఉండి, ఆచార్యులు అనే బిరుదును పొందితే పొంది ఉండవచ్చు. కాని, "నిజానికి మణవాళ మహామునుల విషయంలోనే ఆచార్యత్వపూర్తి ఉన్నది" అని పాము ఉన్న కుండలో చేయి పెట్టి శపథం చేస్తాను.

---

**రక్షిష్యత్యవలీలయా హరిరితి భ్రాంతా స్తమేవ స్తువం–**
**త్యాచార్యాన్వయమంతరా స భగవాన్ నో రక్షితుం శక్నుయాత్ |**
**ఆచార్యత్వ మిహైవ సుందరమునౌ పూర్ణం తతోఽస్యాన్వయం**
**దృష్ట్వైవాచ్యుత ఏష రక్షితు మలం తస్మాన్మునీంద్రో గతిః || 64 ||**

లోకంలో పలువురు భగవానుడే రక్షకుడని భ్రమించి ,ఆ స్వామిని స్తుతిస్తున్నారు. ఆ భగవంతుడు కూడా తాను ఆచార్యసంబంధం లేనివారిని కటాక్షించగలిగినవాడు కాడు. మణవాళ మహామునులలోనే ఆచార్యత్వం పూర్ణంగా ఉన్నందున, వీరి సంబంధాన్ని గమనించే అతడు




**మణవాళమామునులు – మేల్కోట**

రక్షించగలడు. ఇందువల్ల మణవాళ మహామునులే ముముక్షువులకు శరణం.

---

**అధ్వానధ్వవిబోధశూన్యమనసా ముద్ధారణైకేచ్ఛయా**

**లోకాచార్యకృతాః కృతీ రతినిగూఢార్థా మునీంద్రో వరః |**

**వ్యాఖ్యాస్యద్యది నైవ దివ్యకృపయా కృత్స్నం జగద్దుస్తరే**

**సంసారే హ్యపతిష్యదస్య హి గురోర్వాచామభూమిః కృపా || 65 ||**

మంచి మార్గం ఏదో, చెడు మార్గం ఏదో తెలియక తికమక పడేవారికి సహాయం చేయడంకోసం శ్రీపిళ్లై లోకాచార్యులవారు అనుగ్రహించిన రహస్యత్రయ గ్రంథాలను శ్రీ మణవాళ మహామునులు వ్యాఖ్యానించి ఉండకపోతే, అయ్యో!, లోకం అంతా సంసార సాగరంలో మునిగి బాధపడేది కదా! మణవాళ మహామునుల గొప్ప కరుణ మాటకు అందనిది కదా.

---

**మగ్నానాం భవసాగరే తరణివద్విభ్రాజతే యత్పదం**

**దష్టానాం విషయాహిభిర్విహగరాణ్మంత్రాయతే యస్య గీః |**

**దగ్ధానాం దురితౌఘదావదహనైః ధారాధరౌఘాయతే**

**యన్మూర్తిచ్ఛవిచింతనం స జయతాత్ కాంతోపయంతా మునిః || 66 ||**

మణవాళ మహామునుల శ్రీచరణాలు జన్మసముద్రంలోపల మునిగినవారికి నావవంటివి. వారి వాక్కులు లౌకికవిషయాలు అనే సర్పాలచే కరువబడినవారికి గరుడమంత్రంవంటివి. వారి తిరుమేని ప్రకాశాన్ని ధ్యానించడం పాపాలు అనే దావాగ్నిలో తపింపబడుతున్నవారికి వర్షధార వంటిది. అటువంటి మణవాళ మహామునులు వర్ధిల్లాలి.

---

**యన్నోఽవశ్యవిధేయ ఏవ మనుజై శ్చైతన్యకార్యాత్మకః**

**నోచేన్ముక్తికథైవ నేతి వదతాం స్వాంతస్థితధ్వాంతహృత్ |**

**యస్య శ్రీవరయోగిననః సుమహితా సూక్తిః ప్రపన్నౌషధం**

**సోఽయం మామిహవీక్షతే స్మ కృపయా స్యాదేష ఇత్యాదరాత్ || 67 ||**

"చైతన్యకార్యం అయిన సాధనానుష్ఠానాలను తప్పక చేసి తీరాలి లేకపోతే, ముక్తిని పొందే మార్గం లేదు" అనేవారి అజ్ఞానాన్ని పోగొట్టేవి, ప్రపన్నులకు గొప్ప ఔషధంవంటివి అయిన శ్రీసూక్తులను అనుగ్రహించిన మణవాళ మహామునులు దాసుని చూచి "ఇతడు నా కృపకు విషయం కాగలడు" అని కటాక్షించారు.

---

**అహ్నాయాశ్రయత ప్రహర్షవివశాః కాంతోపయంతుర్మునేః**

**పాదాబ్జే అథ తస్య దివ్యఫణితిష్వార్తిప్రబంధం సదా ।**

**ఉచ్చైర్ఘుష్యత సర్వమార్తినివహం సద్యో హతం పశ్యత**

**శ్రేయాంసి స్వయమాగతాని నియతం సంప్రాప్య సంతుష్యత || 68 ||**

మణవాళ మహామునుల శ్రీచరణపద్మాలను వెంటనే ఆనందంగా ఆశ్రయించండి. తరువాత వారి దివ్యసూక్తులలోని ఆర్తిప్రబంధాన్ని బిగ్గరగా అనుసంధించండి. అన్ని ఆర్తులను వెంటనే పోగొట్టుకోండి. సకలశుభాలు స్వయంగానే వచ్చి చేరడాన్ని చూచి ఆనందించండి.



మణవాళమామునులు – తిరుపతి

---

**జన్మాన్య త్ర మహీతలే మమ ముహుర్భూయాసురిత్యర్థయే**

**యద్యేవం వరయోగిసూక్తిరసికః స్యాం సర్వజన్మస్వపి |**

**ఖ్యాతే నిత్యవిభూతినామ్ని నిలయే వాసస్పృహా నాస్తి మే**

**సత్యం వచ్మి మునీంద్! సుందరగురో! పూర్ణం కటాక్షం కురు || 69 ||**

దాసుడు ఇప్పటివలెనే ఎల్లప్పుడు మణవాళ మహామునుల శ్రీ సూక్తులను అనుభవించి ఆనందించేవాడను కాగలిగితే మళ్ళీ తిరిగి ఈ లోకంలోనే జన్మ నాకు కలగాలి. ప్రతి జన్మలోనూ ఈ గొప్ప భాగ్యం నాకు కలిగితే పరమపదంలో కూడా నాకు కోరిక కలిగినవాడను కాను. మణవాళ మహామునీ! ఇదే నా నిజమైన మాట. పూర్ణంగా నన్ను మీరు కటాక్షించాలి.

---

**ఆచారా నభిరామయోగిమణినా సంరక్షితాన్ పావనాన్**
**ధన్యాః శ్రద్దధతే తదన్యజనతా స్సీదంత్యనర్థ్యే పథి |**
**శుద్ధాయామిహ సంప్రదాయసరణౌ సౌభాగ్యభూమ్నా జనిః**
**సంపన్నేతి సదా మమైవ హృదయం హర్షప్రకర్షోజ్జ్వలమ్ || 70 ||**

మణవాళ మహామునులు రక్షించిన సదనుష్ఠానాలలో భాగ్యశాలురు ఆసక్తిని కలిగి ఉంటారు. ఆ విధంగా ఉండని మిగిలినవారు చెడ్డ మార్గంలో అలమటించనీ. పరమ పవిత్రమైన సత్సంప్రదాయరీతిలో గొప్ప భాగ్యవశంచేత జన్మించగలిగామే! - అనే ఆనందం నా మనసులో ఎల్లప్పుడు కలుగుతున్నది.

---

**మంత్రా స్సంతి హి భూరిశో భగవతః కిం తేష్వభూద్గౌరవం**
**కస్తాన్ చింతయతీహ కస్య హృదయం శ్రద్ధాజడం తేష్వహో |**
**శ్రీరంగేందుముఖారవిందమధునః శ్రీశైలమంత్రోత్తమ–**
**స్యోత్కర్షో హి విసృత్వరో విజయతే యోగీంద్! భో స్సుందర! || 71 ||**

మణవాళ మహామునీ! లోకంలో పలు విధాలైన భగవన్మంత్రాలు ఉన్నాయి. వాటికి ఏమి గొప్పతనం కలిగింది? వానిని ధ్యానించేవారు ఎవరు? వాటిలో ఎవరి మనస్సు ఆసక్తిని కలిగి ఉన్నది? శ్రీరంగనాథుని ముఖారవిందంలో ఆవిర్భవించిన మకరందం అని అనదగిన, మీ విషయంలోని "శ్రీశైలేశ దయాపాత్రం" అనే మంత్రంలోనిని గొప్పతనమే కదా లోకంలో అంతటా వ్యాపించి ప్రకాశిస్తున్నది.

---

**ఆచార్యప్రవరే వరే మునివరే యద్యప్యనన్యాశ్రయాః**
**సర్వాస్సంపద ఉల్లసంతి చ తథాఽప్యేకా పరం న్యూనతా |**
**శ్రీశైలేశదయేతి విశ్వవిదితం సర్వోత్తమం పావనం**
**మంత్రం చింతయితుం యదేష మునిరాడ్ భాగ్యం న లేభే భువి || 72 ||**

మణవాళ మహామునుల విషయంలో అన్ని విధాలైన గొప్పతనాలు ప్రకాశిస్తూ ఉన్నా, ఒక కొరత మాత్రం వారికి ఉన్నది. అది ఏమంటే, చాలా గొప్పది అయిన పరమపావనమై వెలిగే "శ్రీశైలేశ దయాపాత్రమ్" అనే తనియన్ శ్లోకాన్ని చింతించే భాగ్యం వారికి లేదు కదా.




‘శ్రీశైలేశ దయాపాత్రమ్’ శ్లోకం ఆవిర్భావ సన్నివేశం

---

**తత్త్వం కించన వచ్మి సుందరమునే! దివ్యోత్సవస్తావకః**

**శ్రీకాంచీప్రభృతిస్థలేషు భగవన్సంపద్యతే భూరిశః |**

**తత్తాదృక్సమయేషు యాదృశమహం హర్షం సమాసాదయే**

**సోఽయం నైవ కిలాన్వభావి భవతా త్వత్తోఽపి ధన్యోఽస్మ్యహమ్ ‖ 73 ‖**

మమవాళ మహామునీ! ఒక వాస్తవాన్ని వినండి. దేవరవారి మహోత్సవం కాంచీనగరం మొదలైన దివ్యదేశాలలో గొప్పగా జరుగుతుంది కదా. ఆ సమయంలో నేను అనుభవించే గొప్ప ఆనందం మీరు ఈ విభవంలో ఉండగా అనుభవించలేక పోయారు కదా ( అప్పుడు మణవాళ మహామునుల ఉత్సవం అనేది జరగడం, దానిని దర్శించి ఆనందించడమనే అవకాశం లేదు కదా). అందువల్ల మీకంటే నేను అదృష్టవంతుడను.




మణవాళమామునులు - తిరుక్కోవలూర్

---

**అన్యేషా మపి యద్యపీహ బహుధా సంపద్యతే హ్యుత్సవః**

**శ్రీమద్రమ్యమునేర్మహోత్సవసమారోహః కిలాన్యాదృశః |**

**భాస్వాన్యావదుపైతు మిచ్ఛతి తులారాశిం తదానీం ప్రభృ-**

**త్యస్మాకం హృదినిస్తులః ఖలు చలత్యుత్సాహనిత్యోత్సవః || 74 ||**

దివ్యదేశాలలో ఇంకా పలువురు పూర్వాచార్యులకు కూడా ఉత్సవాలు జరిగినా, మణవాళ మహామునులకు జరిగే ఉత్సవంలో కనిపించే విశేషం మాత్రం చాలా విలక్షణమైనది. తులామాసం రాబోతున్నది అనేటప్పుడే ఆరంభించి మా మనసులో కలిగే ఉత్సాహమహోత్సవాన్నిగూర్చి ఏమని చెప్పగలను? అది చెప్పడానికి సాధ్యం కానిది.

**రంగాధీశ్వర ఏక ఏవ భగవానర్చాసు ధన్యో మునే!**
**యస్తే శిష్య ఇతి ప్రసిద్ధి మనఘా మద్యాపి సంరక్షతి |**
**కుంభే మాసి వలర్క్షపక్షలసితే ద్వాదశ్యభిఖ్యే తిథౌ**
**యస్మాదధ్యయనోత్సవం చ భవతో నిర్వర్తయన్ మోదతే || 75 ||**

మణవాళ మహాముని! అర్చారూపాలలో శ్రీరంగనాథుడు ఒక్కడే భాగ్యశాలి. ఆ స్వామియేకదా మీకు శిష్యుడైన గొప్పతనాన్ని ఈనాడుకూడా కాపాడుకుంటున్నాడు. ఏ ఆచార్యులకు జరగని తిరువధ్యయన మహోత్సవాన్ని మాసిమాసం శుక్లపక్ష ద్వాదశినాడు దేవరవారికి ఆ స్వామి నడపడం అనేది" శిష్యకృత్యం విడువకూడనిది" - అనే భావనతో కదా.

**అద్యాహం వరయోగివర్య! భవతః స్తోత్రే ప్రవృత్తో ముదా**
**చింతాలేశవినాకృతస్సరభసం పద్యాని విజ్ఞాపయే |**
**స్తోత్రం హంత! సమాప్తి మేష్యతి భవన్మాహాత్మ్యదుగ్ధోదధౌ**
**ద్విత్రా ఏవ హి శీకరాః పరిచితాః పూర్త్యా కథం వర్ణయై || 76 ||**

మణవాళ మహాముని! ఈనాడు తమను దాసుడు కీర్తించాలని ఆరంభించి, ఏ కొంచెం కూడా చింత లేకుండా, ఈ విధంగా శ్లోమాలికను లీలగానే విజ్ఞాపన చేశాను. ఈ స్తోత్రం అయితే ముగియబోతున్నది. కానీ, తమ మహిమ అనే సాగరంలో కొన్ని కణాలు మాత్రమే అనుభవింపబడ్డాయి. మీ మహిమను మొత్తం అనుభవించడం ఏ విధంగా సాధ్యం?




మణవాళమామునులు రాజమన్నార్గుడి లో మంగళాశాసనం చేస్తున్న సన్నివేశం

మందప్రజ్ఞ ఇతీరితోఽప్యహమహో! కాంతోపయంతర్మునే!
విశ్రాంతిం లవలేశతోఽప్యకలయన్ త్వద్వైభవోల్లాసినీః |
పద్యానాం వితతీ రజస్ర మమితా స్సానంద ముత్పాదయన్
ప్రాజ్ఞాగ్రేశ్వర ఇత్యుపాధి మలభే శ్రీమత్కృపాం కిం బ్రువే || 77 ||

మణవాళ మహామునీ! దాసుడు మందమతి అని పేరు పొందినవాడను అయినా, మీ గొప్పతనాన్ని వివరించే శ్లోకాలను నిరంతరం కూరుస్తున్నందున, గొప్ప ప్రజ్ఞావంతుడను అనే బిరుదును పొందాను. మీ కరుణను గురించి ఏమని చెప్పగలను?

మంత్రం త్వద్విషయం సమస్తభగవత్సద్మస్వవాప్తప్రథం
దృష్ట్వా కేచన జాల్మకా అథ పరం పద్యం సముత్పాద్య చ |

**భూయోభూయ ఇహ ప్రకామశ ముపయంత్యుచ్చైః పరాభూతిమి–**

**త్యేతత్సుష్ఠు విజానతామపి బత! త్వద్వైభవం దుర్గ్రహమ్ ‖ 78 ‖**

మణవాళ మహామునీ! తమ స్తుతిపద్యమైన "శ్రీశైలేశ దయాపాత్రమ్" అనే మంత్రం సకలదివ్యదేశాలలో ప్రసిద్ధమై ఉండడాన్ని చూచి కొందరు అసూయాపరులు తాము వేరొక పద్యాన్ని సృష్టించి, మాటిమాటికి గొప్ప పరాభవాన్ని పొందుతున్నారు – అనే విషయాన్ని బాగా తెలిసినవారికి కూడా, అయ్యో! దేవరవారి గొప్పదనం తెలియలేదే!




శ్రీ రాజగోపాల అలంకారంలో మణవాళమామునులు – తిరువహీంద్రపురం

(కణ్ణన్ తిరునక్షత్రం సందర్భంగా)

---

**ఉక్తి స్సత్యతమా తవైవ విలసత్యన్యస్య కస్యాపి నే–**

**త్యాత్మీయానుభవావగాహి తదిదం పూర్వే మహాంతోఽబ్రువన్ |**

**స్వామిన్! సుందరయోగివర్య! భవతః శ్రీసూక్తిరత్నాకరే**

**సంమృష్టే సతి సత్య ముక్త మిద మిత్యుద్ఘోషణా యుజ్యతే ‖ 79 ‖**

మణవాళ మహామునీ! దేవరవారి దివ్యసూక్తులు ఏ అసత్యం లేనివి—అనే వాస్తవాన్ని చక్కగా అనుభవించి తెలిసికొన్న పెద్దలు "పొయ్యిలాద మణవాళ మాముని పుంది వాழி" అని మంగళాశాసనం చేస్తున్నారు. తమ దివ్యసూక్తులను పరిశీలించినపుడు, ఆ మంగళాశాసనం సత్యమని చాటింపు వేయడంలో ఏ అడ్డు లేదు.

---

**నంతాఽనంతపదారవిందయుగలే శ్రేయో భజేద్వా న వే–**
**త్యేవం సంశయ ఏవ కామ ముదియాదిత్యస్తి శాస్త్రస్థితిః |**
**నంతౄణాం వరయోగిపాదకమలే శ్రేయాంసి సర్వాణ్యపి**
**ప్రాదుష్ష్యః విశయావకాశవిధురం నిశ్చప్రచం ఘుష్యతే || 80 ||**

"సిద్ధిః భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్" అనే విధంగా భగవంతుని ఆశ్రయించినవారికి ఫలాన్ని పొందడంలో సందేహం ఉన్నదని శాస్త్రం తెలుపుతున్నది. ఆ విధంగా కాకుండా మణవాళ మహామునుల శ్రీచరణాలను ఆశ్రయించినవారికి సకల శ్రేయస్సులు నిండుగా కలుగుతాయి - అనే విషయం ఏ సందేహం లేని విధంగా ఘోషింపబడుతున్నది.

---

**ఇంద్ర స్సంయమినాం వరో మునివరః కాంతోపయంతా గురుః**
**శ్రీశైలేశగురూత్తమాంఘ్రిశరణో భోగీశ్వరాంశో మునిః |**
**శ్రీమద్రమ్య వరోపయంతృమునిరాడిత్యాది నామావలీం**
**నిత్యం ధ్యాయతి మానసం మమ తత శ్శుద్ధిం పరాం విందతి || 81 ||**

పెరియ జీయర్, మణవాళ మహాముని, అழ்కియ మణవాళ మామునులు, తిరువాయ్ మొழி ప్పిళ్లై గొప్ప దయవల్ల ఉజ్జీవించినవారు, ఆదిశేషుని అవతారభూతులు అని ఈ విధంగా నామావళిని నా మనసు నిత్యం చింతించి, పవిత్రతను పొందుతున్నది.

**అథవా శ్లోకాంతరమ్:**

**ఇంధే కుత్ర వరోమునీంద్ర ఇతి యే పృచ్ఛంతి తేభ్యో బ్రువే**
**స్వానుధ్యానపరాంతరంగకుహరే దివ్యేషు దేశేష్వథ |**
**శ్రీమద్ద్రావిడదివ్యవేదనినదోత్థానస్థలీషూల్లసేత్**
**ఇత్యాహుః మమ మానసే పరమసౌ త్రై స్సాక మాస్తే ధ్రువమ్ || 82 ||**

మణవాళ మహామునులు ఎక్కడ వేంచేసి ఉన్నారు? - అని అడిగితే, తమను ధ్యానించే వారి మనసులోను, దివ్యదేశాలలోన, తిరువాయ్ మొழி ప్రబంధదివ్య గానం చేసే చోట వేంచేసి ఉన్నట్లు పలువురు తెలుపుతారు. దాసుడు అంతమాత్రమే అనడు. వాటి అన్నిటితో పాటు నా హృదయం లోపలకూడా వేంచేసి ఉన్నారు అనేది నా అభిప్రాయం.



మణవాళమామునులు – చిన్న కోవెల,రంగన్న దర్వాజా, హనుమకొండ(వరంగల్)

**మంత్రో యస్య మనీషిణాం సుకృతినాం సర్వస్వభూతో జపన్**

**ధత్తేఽన్యాదృశధన్యతాం హి నిఖిలేఽప్యర్చావతారస్థలే |**

**తస్య శ్రీవరయోగినో గుణగణా నామ్రేడయంతీ స్తుతిః**

**సేయం సర్వఫలప్రదా సుమనసాం వక్త్రేషు జేజీయతామ్ ‖ 83 ‖**

వివేకులైన భాగ్యవంతులకు సర్వస్వం అయిన తమ తనియన్ తో అర్చావతార స్థలాలను అన్నిటినీ పవిత్రం చేసే మణవాళ మహామునుల కళ్యాణ గుణాలను వర్ణించి పలకేది, సకల ఫలాలను ఇచ్చేది అయిన ఈ స్తుతి విద్వాంసుల ముఖంలో ప్రకాశించాలి.



మణవాళమామునుల తిరువరసు – శ్రీరంగం

---

**యద్వా శ్లోకాంతరమ్:**

**మన్యంతా మిహ యచ్చ కించిదపి వా క్షుద్రా జడాః పామరాః**

**సోఽయం స్తౌతి వరోపయంతృయమినం త్వేకం సదేతీర్ష్యయా |**

**సత్యం వచ్మి శఠారిలక్ష్మణమునిశ్రీమత్కలిధ్వంసనా–**

**ద్యాచార్యేష్వపి మందభక్తి రభవం ధ్యాయన్మహాయోగినమ్ ‖ 84 ‖**

నేను మణవాళ మహామునులను ఒకరినే ఎక్కువగా స్తుతిస్తున్నాను - అనేదానిని గూర్చి అసూయవల్ల ఎవరు ఏదైనా అనుకోనీ. సత్యంగా విజ్ఞాపన చేస్తున్నాను. మామునులను ధ్యానించడం ప్రారంభించిన తరువాత నమ్మాళ్వారులు, రామానుజులు, నంబిళ్ళై మొదలైనవారి విషయంలో కూడా నేను భక్తిని తక్కువగా కలవాడను అయ్యాను. అందువల్ల మణవాళ మహామునులను స్తుతించడం నాకు నిత్యకాలక్షేపం అయినది.



మణవాళమామునులు - వివిధ దివ్యదేశాల్లో

**యద్వా, శ్లోకాంతరమ్:**

**మందప్రజ్ఞ జనా అపి శ్రమమృతే జానంతు పద్యార్థమి–**
**త్యుత్కంఠావశతో మునిర్వరవరః స్తోత్రాణి భూయాంస్యహో! |**
**ద్రాక్షాపాకమనోహరాణి సృజతి ప్రేమ్ణా మదీయాన్ముఖాత్**
**ఆచార్యప్రవరస్య తస్య కరుణా కస్య స్తుతే ర్గోచరః? ‖ 85 ‖**

ఇవి సంస్కృత శ్లోకాలు అయినా, వీటి అర్థాన్ని సాధారణమైన వ్యుత్పత్తిని కలవారు కూడా సులభంగా తెలుసుకోవాలి అని నారికేళపాకంలో కాకుండా, ద్రాక్షాపాకంలో ఇటువంటి స్తోత్రాలను మణవాళ మహామునులు నా వాక్కుద్వారా ప్రేమతో వ్యక్తీకరింపజేస్తున్నారు. ఆ మహాచార్యుల పరమకృపను ఏమని వర్ణించను?



మణవాళమామునులు – శ్రీరంగం

**శ్రీవైష్ణవానాం గోష్ఠీషు తద్దాస ఇతి విశ్రుతః |**
**శ్రీశైలేశదయాపాత్రస్తోత్ర మేతద్వ్యజిజ్ఞపత్ ‖ 86 ‖**

శ్రీ వైష్ణవగోష్ఠిలోని వారికి దాసుడని ప్రసిద్ధి చెందిన ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు శ్రీశైలేశదయాపాత్రస్తోత్రమనే ఈ గ్రంథాన్ని విజ్ఞాపన చేశారు.



మణవాళమాములు –తిరునిన్టవూర్

**శ్రీకాంచీ అణ్ణంగరాచార్యస్వామి విన్నపించిన శ్రీశైలేశదయాపాత్రస్తోత్రమ్ సంపూర్ణమ్**

ଔଔଔଔଔଔଔଔଔଔଔ